శ్రీ

# గానకళాచంద్రిక.

సంగీతవిద్యాభ్యాసకులకును సంగీతోపాధ్యాయులకును
యుపయుక్త మగునటుల
ఇయ్యది

బ్రహ్మశ్రీ సంగీతవిద్వాన్ వారణాసి బ్రహ్మయ్యశాస్త్రిగారి
ప్రియశిష్యులును, విజయవాడ ఉన్నతప్రాథమిక బాలికా
పాఠశాలా సంగీతోపాధ్యాయులు నగు బ్రహ్మశ్రీ
**అరిపిరాల సత్యనారాయణమూర్తిగారిచే**
ర చి యిం ప బ డి



మహారాజరాజశ్రీ విశ్వదాత - దేశోద్ధారక
**కాశీనాథుని నాగేశ్వరరావు పంతులువారి**
ద్రవ్యసహాయమునువలన
ఆంధ్రపత్రికా ముద్రణాలయమందు
ముద్రింపబడియె.

1933

[వెల రు 2-0-0.





ఈ గ్రంథమును వలయువారు
ఈ క్రింది అడ్రెసుకు వ్రాసి తెప్పించుకొన ప్రార్థితులు.

అడ్రెస్ :—

అరిపిరాల సత్యనారాయణమూర్తి,
సంగీతోపాధ్యాయులు,
"సుందరవిలాస్," గాంధీనగరము,
బెజవాడ.

# FOREWORD.

I have the pleasure to bring to the notice of the public, "Ganakala Chandrika," one of the rarest books on Indian usic, written by A Satyanarayanamurti, Music teacher, unicipal Higher Elementary Girls' School, Bezwada. iere are comparatively very few books on Indian Music, at would be of use to the ordinary man. Music, as any her art, has set rules to be put down for guidance. Music," however, goes beyond what could be put in black d white, since it appeals to the Inner Spirit, and carries e's soul to regions, higher and nobler than ours. Though h is the subject that has been handled by the author, s the outcome of strenuous and conscientious labour on part. He has tried to present the subject, in a style, ich could easily be understood and appreciated by one d all. In this little book, we will find not only Geethams, rnams, and Songs of the newest and up-to-date choice, a fairly detailed account of the construction, and the es pertaining to the teaching or learning of Music, in his roduction, and explanatory notes to the various songs he chosen.

Moreover, the book is intelligently graded, and could ily be used in all the Girls' schools. The book serves a guide to the teacher, and as a storehouse of know- ge to the pupils in schools and out of schools. It need rdly be said that the author has presented the subject in fullest, yet in a most concise form.

I heartily wish that the book will be met with all the cess it deserves in the hands of the public.

P. PURNAMMA,

*Deputy Inspectress, Kistna Girls' Range,*

BEZWADA.

## II

It is with great pleasure that I write the forewo 'Ganakala Chandrika' composed by Aripirala Satya yana Moorty Garu of Bezwada. I feel that the au engaged as he is in the practical line of teaching musi best qualified by his profession to write for begin From a perusal of some portions of the book, I feel the author has faced difficulties which confront begin There is an originality about his own compositions w serve not only as a means of practice to the novice also caters to the higher aesthetic sense. "Good needs no bush" and a good book needs no further pr

(SD.) D. VENKATASWAMY,
*Prof. of Violin Music*
*Maharajah's Music Coll*
VIZIANAGARAM.

విజయవాడ వాస్తవ్యులగు శ్రీయుత అరిపిరాల సత్య యణమూర్తిగారిచే రచియింపబడిన "గానకళాచంద్రిక" అను గ మునకు భూమిక వ్రాయుట సంతోషదాయకము. అందలి కొన్ని భాగములను చూచితిని. సంగీతోపాధ్యాయులై లక్షణవివరణ చక్కగా నెఱిఁగియుండుటచే నిట్టి పొత్తమును వ్రాయుటకు వా తార్హులు. గానకళయందలి ప్రాథమిక అభ్యాసమునందుండు ద ధ్యములగు ప్రకరణములను సులభముగ గ్రాహ్యమగునటుల యున్నారు. ప్రారంభకులకేగాక గానకళోపాసకులకుఁగూడ ముగ నుండునటుల స్వకల్పితములగు కొన్ని విషయముల నింద యున్నారు. సద్గ్రంథములను మిక్కిలి ప్రశంసించుట యనవస వానివిలువ వానియందే వ్యక్తమైయుండును.

డి. వెంకటస్వామి.
ఫిడేల్ ప్రొఫెసర్,
విజయనగరం మహారాజా గానకళా
విజయనగ

# పండితాభిప్రాయములు.

I have carefully gone through "Gana Kala Chandrika" a Book on Music by Brahmasri Aripirala Satyanarayana Murthi Garu of Bezwada. This author after referring to many other books on Music, has written this book in a style suitable to the requirements of the times. It will form an useful and invaluable book on music both for the present day students that appear for Government "Techinical" (musical) examinations, and great Pandits as well.

I am extremely glad that Mr. Satyanarayanamurty has been able to write a book like the one he has done. By so doing, he had laid the musical world under a deep debt of obligation.

GAYAKA SIKHAMANI,
(Sd.) L. MUTHIAH BHAGAVATHAR
13—2—1933. OF HARIKESA NALLOOR,
*Palace Vidwan, Mysore State;*
*Member of Examination Board, Mysore University;*
*Member, Board of Studies, Madras University;*
*Principal, Teachers' College,*
*Music Academy, Madras,*

బ్ర॥ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారిచే రచింపబడిన "గానకళాచంద్రిక" యను సంగీతగ్రంథమును నేను పరిశీలించితిని. ఈ గ్రంథకర్తగారు సంగీత విషయమైన యనేకగ్రంథములను పరిశోధించి వాటి సారమును గ్రహించి యీ కాలమునకు తగినటుల బాల్యాభ్యాసకులకును, పెద్ద విద్వాంసులకును మిక్కిలి యుపయోగమగు పద్ధతిలో వ్రాసియున్నారు. ఈ గ్రంథము సంగీతవిద్యాగళవు

పాఠశాలలకును గవర్నమెంటువారిచే నియమితములగు "టెక్నికల్ పరీక్షల కేగువారలకును "టెక్స్టు"గా నియోగింప తగినదిగా నున్నది. వా రిట్టి సద్గ్రంథమును రచించి లోకోపకార మొనర్చినందులకు నే నెంతయు మనఃపూర్వకమైన సంతసముఁ దెలియఁ జేయుచున్నాను.

గాయకశిఖామణి,

13-2-1933

యల్. ముత్తయ్యా భాగవతార్,
ఆఫ్ హరికేశ నల్లూరు.
పాలెస్ విద్వాన్ - మైసూరు,
మెంబరు ఆఫ్ ఎగ్జామినేషన్ బోర్డు, మైసూరు యూనివర్సిటీ,
మెంబరు, బోర్డు ఆఫ్ స్టడీస్, మదరాసు యూనివర్సిటీ;
ప్రిన్సిపాల్, టీచర్సు కాలేజి, మ్యూజిక్ ఎకాడమి, మదరాసు.

---

## II

సంగీతసాహిత్య కవితాపారీణ వేదాంతభాష్యభావనాపరాయణ
వాగ్గేయకారక హరినాగభూషణము, బి. ఏ.
జిల్లాకోర్టువకీలు, మచిలీపట్టణము.

గీ॥ అచ్చటచ్చట నరసితి నార్యులార!
సత్యనారాయణాభిఖ్య చరితమైన
యట్టి గానకళాచంద్రి కాఖ్యదనరు
గానశాస్త్రము; మోదముఁ గాంచినాఁడ.

క॥ విద్యార్థులునుం గానక
ళోద్యోగులునైన గురువు లుత్సాహంబున్
సద్యఃఫలమును గాంచగ
నాద్యంబగుఁగాత యిద్ది యానందాబ్ధిన్.

గీ॥ సత్యనారాయణాఖ్య ! సత్సంగసక్త
చిత్త! నీదగుచేతలు చిరయశంబుఁ
బొందుఁగావుతఁ బరమేశు నిందువాళి
కృపకుఁ బాత్రిముతొాచు నీతపము మెఱయ.

శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారిచే విరచితమైన "గానకళాచంద్రిక" అను గ్రంథముఁ దిలకించితి. ఇయ్యది సంగీతవిద్యార్థులకును సంగీతోపాధ్యాయులకును మిగుల నుపకారంబుగ నుండునని చెప్పఁగలను. దేవబ్రాహ్మణులయెడ భక్తియు, సమస్తప్రాణులయెడఁ గృపయుఁగలిగి యీ గ్రంథకర్తగారు భగవద్భక్తితోడ జీవయాత్రఁ గడుపుచు నీపుస్తకరాజంబున నపారయశంబు సంపాదించి, యిట్టికృతు లనేకంబు లొనర్చి కృతకృత్యులగుఁగాక.

ఇట్లు
భాగవతవిధేయుఁడు,
హరి నాగభూషణము.

---

III

"గానకళాచంద్రిక" యను నీగ్రంథము సంగీతవిద్య నభ్యసింపఁ గోరువారి కెంతయు నుపయుక్తముగ నున్నదనుటకు సందియము లేదు. ఇయ్యదిస్వరావళ్యాదికృతులపర్యంతము సలక్షణంబుగనొప్పియుంటయే గాక భావాలంకారభూయిష్ఠమై, యనేక నూతనమార్గములు గానకళార్థుల కనువగునటుల సులభశైలిని వ్రాయబడియున్నది. అభ్యాసకులకు మిగుల సహకారికాదగిన యీ గ్రంథము సంగీతవిద్యాభిలాషుల కేగాక సంగీతవిద్యఁ గఱపు బాలబాలికా పాఠశాలలందుండు గానకళోద్యోగులకుగూడ బఠనీయగ్రంథమై బహుజనసమాదరణమును వడసి వర్ధిలుగాక.

ఇట్లు,
సంగీతవిద్వాన్,
వారణాసి బ్రహ్మయ్యశాస్త్రి.

## IV

గీ॥ హాయిగాఁ దీగె మోగించు నరిపిరాల
సత్యనారాయణుఁడు మేటిచదువరియయి
పాడిఖాయించుకొనుసేర్పు వ్రాసె దెలిపె
నాగ! లయకాండుగ్రి కాఁగలవారికెల్ల.

ఆదిభట్ల నారాయణదాసు,
ప్రిన్సిపాల్
విజయనగరం మహారాజా గానకళా
విజయనగరము,

25—11—32.

---

## V

గీ॥ ఆదినుండియు నీ వ్రాసినంతవఱకుఁ
జక్కగాఁ జూచినాఁడ పుస్తకము నెల్ల;
ఉర్వి నారంభకులకు మహోపయోగ
కరము, గానామృతాస్వాదకరము నిజము.

గీ॥ అవని నాచంద్రతారకంబగుచు నేర్చు
కొనెడు వారికిఁ ద్వర గానధనము నొసగు
నీదు గ్రంథము గాయకామోదదంబు
నగుచు వరలుత, సత్యనారాయణాఖ్య!

గీ॥ ఆదినుండియు నీయోగ్యతాతిశయము
బుద్ధికౌశల మెఱుఁగుదు బుధుత వీవు
గ్రంథ మీరీతి నెటుచేయఁగలిగినాఁడ
వౌర! శ్రీసత్యనారాయణాభిధాన!

కాశి కృష్ణాచార్యులు,
అవధాని శిరోమణి,
గుంటూరు.

---

# ఉపోద్ఘాతము.

—————

ాఠకులారా !

ఈ భరతఖండమ్మున సుప్రసిద్ధ గానకళానిధులు పూర్వు లనేకలక్షణగ్రంథ
నాకాలమున ప్రాముఖ్యమగు మాతృభాషయందు రచించి శాశ్వతదేశోపకార
ను గావించియున్నారు. కాని యట్టిగ్రంథములు జనసామాన్యమునకు సుబోధముగ
డమిచే నిటీవల గొందరు ప్రముఖు లాగ్రంథముల నాంధ్రీకరించి యున్నను నవి
స్తుతప్రభుత్వనియమితవిద్యావిధానమున కంతగా నుపకరింపబడనందున నభ్యాస
లెప్పట్టున గొంతశ్రమకు లోనగుచున్నారు.

గానమునకు భావము ప్రధానము; అట్టిభావము స్వరలయాదుల ననుసరించియు
సంప్రదాయము ననుసరించియు సుబోధముగ గన్పట్టవలెను. అట్లగునేని సామాన్యా
ిసకు లీకళయందు దింపకంటె నెక్కుడుత్సాహవంతు లగుట కవకాశములు జాల
వు. అని నాస్వల్పానుభవమునుబట్టి యూహించి సంగీతవిద్య నభ్యసింపఁగోరు
బాలికల కనువగుశైలిలో "గానకళాచంద్రిక" అను నీ గ్రంథమును రచింప
హసించినాడ. ఇందు స్వరావళి మొదలు కృతులవరకుఁ గల అనేకముఖ్యలక్షణ
స్యంబులఁ దేటతెల్లముగ వివరించితిని; ఇట్టి లక్షణముల కనుసారముగ లక్ష్యభూ
ర్తికర్తలును గానకళాధురీణులును పూర్వాచార్యులనగు శ్రీమత్త్యాగరాజ, శ్యామ
స్త్రి. వెంకటమఖి, గోపాలకృష్ణభారతి, అరుణాచలకవి, ముద్దుస్వామిదీక్షిత, పురం
విఠల్ దాస, రామదాస, క్షేత్రిజ్ఞ, జయదేవ, నారాయణతీర్థ, సుబ్రహ్మణ్యయ్య
కృతులగువారిచే రచింపఁబడిన కీర్తనలకు విద్యార్థుల కాకర్షణీయమగు సులభమార్గమున
రపరచియున్నాను. అదియునుగాక మహారాష్ట్రాది యితరభాషా కీర్తనలకును
ప్రకృతిగానమున కనుకృతిగ బాలికామణు లాటలందు గానమొనర్చు దేశీయకీర్త
నలకును తాత్కాలికరుచ్యంబులగు జావళీ, పదము, తిరుప్పుగళ్, తరంగము, అష్టపది,
ానా, హిందూస్థాని, ఆదిగాగల లలితగేయముల నాయాస్థాయిగురుతులతో
స్వరించి వెలువర్చితిని .ఇక బ్యాండుస్వరములను హృద్యమగునటుల తాళానుసారముగ
క్రమితములతో విశదీకరించి గానాభ్యాసకులయొక్కయు తదభిమానులయొక్క
ు నంతరంగముల వింతసంతసము దలిర్ప నీగ్రంథరచనయందలి నావలయు ప్రయ
ముఁ బూరించితిని. ప్రభుత్వమువారిచే నియమితములగు గానకళాపరీక్షల కేగు
ారికిగూడ నీగ్రంథము మిక్కిలిగా నుపకరింపవలెననుతలంపుతోనే నా ప్రయత్నమును
ాగించితిని. ఈపాఠ్యము సంగీతవిద్యాభ్యాసకుల కెంతగా నుపకరింపనర్హమయు

సలక్షణముగ వ్రాయబడినదనుటకును, నిందుతో బొందుపరచినపండితులయొక్క విద్యాశాఖాధికారిణుల యొక్కయు, నభిప్రాయములే నిదర్శనములు. ప్రాథమిక గ్రంథరచనయం దత్యంతోత్సాహ మొసంగి నా కెంతయుఁ దో లోగడ కృష్ణా గరల్స్ రేంజీ డిప్యూటీ ఇన్‌స్పెక్ట్రెస్ గానుండిన శ్రీమతి పి. పు బి.ఏ., యల్.టి., గారికిని, మ. రా. రా. శ్రీ సంగీతవిద్వాన్ సి. ఆర్. శ్రీ అయ్యంగారు, బి.ఏ. గారికిని మ. రా. రా. శ్రీ సంగీతవిద్వాన్ కె. భైరవమూ కిని నేనెంతయు గృతజ్ఞుడను.

'మందః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్' అను మహా దాసోక్తిని దలంచుచు, అత్యంతశ్రమసాధ్యమగు సలక్షణగ్రంథరచనాయ గొనసాగించితిని. ఇం దేవేని ప్రమాదజనితములగు దోసంగు లున్న గుణగ్రహ ణులగు పండితులు వానిఁ దెలుపుచో నత్యాదరంబునఁ జేకొని పునర్ముద్రణ శించుకొనెదఁ గాక !

ఆదినుండియు నఖండప్రేమవాత్సల్యముతో సంగీతవిద్యఁ గరపి పెంచిన వర్యులగు సంగీతవిద్వాన్ బ్రహ్మశ్రీ వారణాసి బ్రహ్మయ్యశాస్త్రి గారికిని, చే చిన్నపొత్తముఁ జూపినతోడనే యత్యాదరంబునఁ జేకొని తమ సహజోదారతా సాంద్రశరచ్చంద్రికానుసారశీతలకటాక్షప్రసారమున నాయంతరంగ మాశీతల యుచితముగ నచ్చొత్తించి, యచిరమున రసికలోకమున కర్పింపఁజేసి, కృ వించిన భాషాజీవనులగు దేశోద్ధారక, విశ్వదాత, శ్రీయుత కాశీనాథుని నా రావు పంతులవారికిని, నాకృతజ్ఞతావందనశతంబు లర్పించుచున్నాడను.

ఇట్లు విబుధజన విధేయుఁడు,

అరిపిరాల సత్యనారాయణమూర్తి

సంగీతోపాధ్యాయుఁడు,

ఉన్నత ప్రాథమికబాలికాపాఠశాల, విజయవా

# శ్రీ వాగ్గేయ కారకుల చరిత్రము.

## 1. శ్రీత్యాగరాజస్వామి.

రమారమి 230 సంవత్సరములకు మునుపు తిరువారూరిలో 'గిరిరాజకవి' యను
కబ్రాహ్మణోత్తము డుండెను. అయన కయిదుగురు కుమారులు. కడపటివానికి
మబ్రహ్మమనిపేరు. ఇతడు వేదశాస్త్రములందు మహానిపుణుడు. ఇతని భార్యపేరు
ంత. వీరిరువురును ఐకమత్యముతో గాపురము సేయుచుండ భగవదనుగ్రహమున పం
పకేశుడు, రామనాధుడు, త్యాగరాజు అను ముగ్గురు పుత్రులు పుట్టిరి. రామ
హ్మము లేమిడిచే మిగుల కష్టపడి తన భార్యాపుత్రులతో తిరువారూరిని విడిచి తిరు
య్యారు' అను పంచనదక్షేత్రమునకు వచ్చి తన యుత్తమగుణశీలములే సహాయముగా
ని కాలక్షేపము జేయుచుండెను. ఇతని కుమారులలో మొదటియిద్దరును లౌకిక
త్యములం దిరుగుచు కుచేష్టలయందుమాత్రము మిక్కిలి చొరకువగలవారై యుండిరి.
డవవాడగు త్యాగరాజు తండ్రికనుకూలుడై యుండి వేదాధ్యయనమును సంస్కృత
షాభ్యాసమును, జేయుచువచ్చెను. ఈతని పదునాలవయేట దండ్రియును తరువాత
క సంవత్సరమునకు దల్లియును కాలగతిజెందిరి. ఈ లోపల క్రమాంత మధ్యయన
ను కావ్యనాటకాలంకార వ్యుత్పత్తియును పొంది వెనుక సంగీతము నభ్యసింప
చెనను నపేక్షతో నాక్షేత్రమున నివసించుచున్న శొంఠి వెంకటరమణయ్య యను
క సంగీతవిద్వాంసునియొద్ద సంగీత మభ్యసింప దొడగి యేకసంతగ్రాహియై సంగీత
క్షణములు, రాగాలాపనము, పల్లవి, తాళవిషయములలో వీరికి సమానులు లేరని పేరు
ంచెను. ఇట్లుండ కాంచీపురమునుండి వచ్చియున్న యొక భాగవతోత్తమునియొద్ద
రామతారకమంత్రోపదేశముబొందెను. ఆ భాగవతోత్తముడు తొంబదియారు
ట్లు రామనామము జేయువారు జీవన్ముక్తు లగుదు రనియు నీవటుల జేసితివేని ముక్తినొం
దు వనియు ననుగ్రహించిన, నాప్రకారమే ప్రతిదినము 1,25,000 నామమువంతున 21
వత్సరముల 4 మాసములకు 96,00,00,000 పూర్తిజేసెను. పిమ్మట శ్రీరామచంద్రులు
డవసారి ప్రత్యక్షమై సాహిత్యములు జేయునట్లనుగ్రహించెను. ఒకనాడు శ్రీ
త్యాగరాజయ్య శ్రీరాములసన్నిధానమందు గూర్చుండి నామముజేయుచుండునపుడు
కిలితలుపు తట్టినటుల శబ్దము విని గమనించిచూచునపుడు శ్రీరాములు లక్ష్మణసహి
లై విశ్వామిత్రుని యాగసంరక్షణార్థము వెడలుచున్నటుల దర్శనమిచ్చి వెంటనే
ంతర్ధానము జెందిరి. తోడనే యెట్టి ప్రయత్నములేక "బాల కనకమయ చేల సుజన
రిపాల శ్రీరమాలోల" అను కీర్తనరూపముగ శ్రీరాముల స్తుతింపదొడగెను.
ది వీరిచే రచింపబడిన మొదటిసాహిత్యము. అఠాణారాగమున చమత్కారములగు
క్రమములతోడను, అర్థపుష్టితో నమర్చబడిన పదశయ్యలతోను నలరు నీకీర్తనమును
నిన భాష్యం కృష్ణశాస్త్రులు రామశేష శాస్త్రులు, మొదలైన సంస్కృతపండితులును

* వాగ్గేయకారకులు = సంగీతసాహిత్య విద్వాంసులు.

సంగీతవిద్వాంసులును ఈయన గంధర్వుడో నారదమునీంద్రుడో యని
ను చిరి. తరువాత హుసేనిరాగమున "రామా నిన్నే నమ్మినాను"
కీర్తనము లనేకములుగా జేయుచుండ నొకనాడు శ్రీ నారదమునీంద్రులు ప్ర
మున సన్న్యాసిరూపమున శ్రీ త్యాగరాజయ్యగారి యింటికి వచ్చి యీతనిగని
రాజని యెవరో సంగీతవిద్వాంసుడు గలడట. వానిగానము విననలెనని వా
యున్నది.' అని చెప్పినమాత్రమున తైలమంటుకొని యున్న శ్రీ త్యాగయ్య
సన్న్యాసిని నుపచరించి నేనే త్యాగరాజునని తెలియపరచి యొకముహూ
గాంధర్వగానమని యెంచునట్లు గానముజేసెను. ఆ యతిశ్రేష్ఠులు మిగుల స
'నీవు సదృశముగా గానరస మెరిగినవారు ఈభువిలో నెవరునులే రని పలికి యొక
నిచ్చి యిది నీయొద్ద నుంచుము. నే ననుష్ఠానము దీర్చుకొని తిరిగి భిక్షుకు వచ్చెద
యంతర్ధానమందెను. వెనుక నాయతని నెక్కడ వెదకియు గానక చింతా
యాహారము మరచి రాత్రివరకు బూజించుచుండి కనుమూయునంతలో స్వ
పగలు దర్శనమొసగి వెడలిన మహాపురుషుడు గనుపించి 'అయ్యా! నేను నా
నీదు విద్యా మహిమ భక్తి యనుష్ఠానములకు కట్టువడి సంతోషభరితచిత్తుడ
నీకు దర్శనమొసగి:ని. నేను నీ కొసగినది స్వరార్ణవ మనెడి సంగీతగ్రంథము.
భూలోకంబున నెవరును దీని నెరుగరు. నీవుదక్క నన్యులు నీగ్రంథముజూడ
గారు. నీవలన సంగీతము ప్రసిద్ధిజెందవలయు ననెడిఅభిప్రాయముతో నీస్వర
నీకిచ్చి ని. ఇక చంచలము నివృత్తియానని పలికి మరుగుజెందెను. ఉదయమున
తనయొద్దనున్న గ్రంథమునుజూడ స్వప్నంబున గన్నట్లేయుండగ పరమానంద
వెంటనే "నారదగురుస్వామి" అను దర్బారుకీర్తనమును "శ్రీనారద
నీరుహ" అను కానడ కీర్తనమును జేసెను. తరువాత స్వరార్ణవముజూచి య
రహస్యముల గ్రహించి భక్తిమార్గముగా ననేకకీర్తనముల రచించి బ్రహ్మాన
బొందిరి. ఇది వారియసాధ్యముకాని విషయము.

కేరళదేశమున షట్కాల గోవింద దాసుడను గొల్లడు గానవిద్యయందు
యందును శ్రేష్ఠుడై యుండునపు డొకనాటిరాత్రి స్వప్నంబున శ్రీరామచంద్ర
పించి 'నాదు భక్తశిరోమణియగు త్యాగరాజు పంచనదంబున గానమూర్తియై
చున్నాడు. వాని దగ్గరకు వెడలి వానిని దర్శించి నీమువిద్యను జూపు' మన నా
త్యాగరాజయ్యను వెదకికొనుచు వచ్చి వారికి తనగానమును వినిపించి వారిగా
తాను విని పరమానందభరితుడై, భక్తిజ్ఞానములను, సంగీతశాస్త్రమును భక్తుల కన
చుటకొరకై యవతరించిన ఈశ్వరాంశమైనమూర్తియేగాని వేరుగాదని శ్రీ
వారిని కొనియాడి తాను గనిన స్వప్నంబున గలవృత్తాంతమును తెలియజేసి నమస
పండరీపురము జేరెను.

ఇదేతీరున గంగాతీరమున వసించు మరియొకభక్తుడు స్వప్నంబును గ
య్యొనుక వచ్చి అయ్యగారిని దర్శించి తన వృత్తాంతము నెఱింగించినతోడనే
గారు తోడిరాగమున "దాశరథీ" యనెడి కీర్తనరూపముగా ప్రారంభించిరి. అ

అయ్యవారి యమానుషకృత్యంబులు దేశ మంతటను వ్యాపింపగనే మైసూ

పూరు మొదలగుదేశముల యధిపతులు శ్రీ త్యాగయ్యగారిని జూచుటకు నిచ్ఛగలవారై పత్రికల నంపగా శ్రీరామునిదప్ప దక్కినవారికృప తన కవసరము లేదని యెంచి యుండునపుడు తంజాపూరు శరభోజమహారాజు తానే పంచనదమునకు వచ్చి శ్రీ అయ్యవారిని రమ్మని తెలియజేయగా సమ్మతింపక "నిధి చాలసుఖమా రాముని సన్నిధి సేవసుఖమా"యనెడి కల్యాణికీర్తనరూపముగా పూర్తిజేసెను. ఇట్లు పలువిధములనేక కీర్తనములు జేసియున్నారు. మరియు పుణ్యక్షేత్రముల దర్శించుటకై శ్రీరంగమునకేగినప్పుడు "ఓ.రంగశాయి" మొదలగుకీర్తనములును తిరుపతికేగినపుడు "తెర తీయగరాదా" మొదలగుకీర్తనములను జేసియున్నారు. ఒకసమయమున శ్రీత్యాగయ్యవారి సోదరులు 'మహారాజులు పత్రికల నంపిననుగూడ వెళ్లక విగ్రహములను గట్టుకొని తిరుగుచున్నా'రను నీర్ష్యచే విగ్రహములను కావేరినదియందు పారవేయగా నది తెలిసి శ్రీఅయ్యావారు "ఏమిపాపము జేసితినో" అనుకీర్తనమును "ఇటువంటి సహోదరులు నాతో బుట్టి భక్తిసేయ విడువక నన్ను శ్రమపరచెద"రని మొరపెట్టెను.

ఇట్లు వీరి ఆయుష్కాల మంతయు శ్రీరామభజనతో గడచెను. వీరి నిర్యాణమునకు మును పొకనాడు శ్రీరామచంద్రులు దర్శనమొసగి యింక పదినెలలీభూమియందు నీ వుండవలెనని యాజ్ఞాపించినందున మరునాటి వేకువ మేల్కాంచినతోడనే తన స్వప్నంబును ప్రకాశపరచి "గిరిపై నెలకొన్న రాముని" అను కీర్తనమును జేసెను. పదినెలలు గడచిన పిమ్మట స్వప్నంబున శ్రీరాములు 'ఇంక నీ కొక జన్మమున్నది' యని చెప్పినతోడనే 'నేను ఇంతకాలము మిమ్ము నారాధించి పునర్జన్మ మందుదునా?' యని ప్రార్థించినతోడనే శ్రీరాములు కనికరమున 'నీవు వెంటనే యత్యాశ్రమము స్వీకరించినచో నీవేని యాదినమే నాలోనిన్ను నైక్యముజేసికొందు న'ని వాక్రుచ్చెను. వెంటనే ఈ సంగతి నందరికి దెలియజేసినవారై మరునాటిదినము విద్వాంసులును భక్తులును గూడియుండగ నాశ్రమస్వీకారమును జేసిరి. మరునాటియుదయమున "శ్యామసుందరాంగ" అను కీర్తనమును జేసి శిష్యులును విద్వాంసులును భక్తులును వైదికులును మొదలగువారితో నాటిదినము పగలు పదిరెండుగంటలకు నిర్యాణము జెందునట్లుల భగవంతుడు తనకు నియమించె నని తెలుప చుట్టుపక్కల పలుతావులనుండి యీవైభవముజూచుటకు లెక్కలేని జనులు వచ్చియుండిరి. శ్రీ అయ్యగారు జెప్పినకాలము సమీపింపగానే గాయకులు గానమును, వైదికులు వేదమును, భక్తులు నామము జేయుచుండ శ్రీ త్యాగరాజస్వామివారు దీపారాధన జేయించి తనవాక్కుచే "జానకీకాంతస్మరణే" అని నామావళిసేయ జను లందరు "జయ జయ రామా" అని చెప్పగ నంజలిహస్తములతో భగవంతునికి నమస్కరించి సకలజనులు జూచుచుండ పరమపదసిద్ధినిబొందిరి. తోడనే యనేక వైభవములతో శ్రీ అయ్యవారిపుణ్యశరీరమును కావేరీతీరమున సమాధిచేసిరి. వీరు డెబ్బదియేడవయేట నిర్యాణమునుజెందిరి. వీరికి పురుషసంతతి లేను ముప్పదియైదవయేట మొదటిభార్య లోకాంతరమునొందెను. రెండవభార్య వీరనిర్యాణమునకు మును పొక యాడుశిశువును గని గతించెను. ఆ బాలికపేరు సీతామహాలక్ష్మి. ఆమెకు మగశిశువుగలిగెను. వానిపేరు త్యాగరాజు.  అతడు ముప్పదియైదవయేట లోకాంతరముజేరెను. శ్రీ త్యాగరాజస్వామివారి

శిష్యులలో ముఖ్యులు; 1. తిరువత్తూరు వీణకుప్పయ్యగారు, 2. బాలాజీపేట వేం రామభాగవతులు, 3. అయ్యాభాగవతులు, 4. సుబ్బరామభాగవతులు, 5. స్థానం రామయ్యగారు, 6. ఉమయాపురం కృష్ణభాగవతులు, 7. సుందరభాగవత మొదలగువారు. శ్రీఅయ్యవారు రచించినగ్రంథములు 1. దివ్యనామావళి 2. రాగరత్నా లిక 3. భక్తవిజయము, 4. నాకాచరిత్రము. 5. ప్రహ్లాదచరిత్ర. శ్రీత్యాగయ్యగారి తము ఇంగ్లీషులో సర్ సామ్యూల్ జాన్‌సన్ జీవితముమాదిరిగా నుండును. వీరి చరిత్రనుబట్టి చూడగా వీరు క్రీ॥ శ॥ 1759 - 1847 ప్రాంతమువా రనియు కలి గము (4948) పరాభవనామ సం॥ పుష్యబహుళ పంచమి తిథియందు బ్రహ్మైక్య బొందిరనియూ తెలియుచున్నది.

## 2. శార్ఙ్గదేవులు.

ఇతడు కాశ్మీరదేశస్థుడు. యాదవవంశస్థుడు. వరగణ ఋషిగోత్రుడు. భా రుని పౌత్రుడు. సోడ్డలదేవుని పుత్రుడు. ఇతడు 'అధ్యాత్మవివేకము' అనెడి వేద గ్రంథమును, స్వరగతాధ్యాయము, రాగవివేకాధ్యాయము, ప్రకీర్ణకాధ్యాయ ప్రబంధాధ్యాయము, తాళాధ్యాయము, వాద్యాధ్యాయము, నృత్యాధ్యాయము అ యేడధ్యాయములుగా జెప్పబడిన సంగీతరత్నాకర మను గొప్పగ్రంథమును రచి మహాపండితుడు. అదియునుగాక 'నిశ్శంకు'డను బిరుదుగూడ వహించియున్నటుల గ్రంథమున వ్రాసియున్నాడు. ఇతడు క్రీస్తు శకము 1210 మొదలుకొని క్రీస్తుశక 1247 వరకు 'దౌలతబాద్' అనెడి దేవగిరినగరమున రాజ్యముచేసినవాడైన సింహ రాజుకాలములో నుండినవాడని తెలియుచున్నది.

## 3. వెంకటమఖి.

ఇతడు గోవిందదీక్షితులవారి ద్వితీయకుమారుడు. తల్లినాగమాంబ. వేంకటే దీక్షితు లనునామముకలవాడు. ఇతడే వెంకటమఖి. తనజ్యేష్ఠుడైన యజ్ఞనారాయణ తుల శిష్యుడు. ఇతడు టుప్టీకావ్యాఖ్యానమైన వార్తికాభరణమును జేసెను. ఉ దేశమునుండి వచ్చిన వాగ్గేయకారకులలో మేటియైన తానప్పాచార్యులవద్ద తనత యనుమతిచే లక్షణలక్ష్యములతో సంగీతశాస్త్ర మభ్యసించి తనగురువైన తాన చార్యులమీద ఆరభిరాగమందు "గంధర్వజనతాఖర్వ మర్వార గర్వభంజనురే" గీతమును ప్రఖండముగా రచించి మొట్టమొదట తన తండ్రి అన్న గురువు గార్ వినిపించెను. అప్పయ్యదీక్షితులవారి సహోదరుడైన ఆచ్చాదీక్షితుల పౌత్రుడగు కంఠదీక్షితులు వెంకటమఖియొక్క శిష్యుడని తన గంగావతరణకావ్యమందు జెప్పి న్నారు. నీలకంఠదీక్షితులు నీలకంఠవిజయ మను చంపూప్రబంధముచేసిన కాలము శకము 1638, రఘునాథభూపాలునివెనుక నతని కుమారుడైన విజయరాఘవభూ లుని ప్రేరణవలన వెంకటమఖి తా నుద్యోగము చేయుకాలమున వీణ, శ్రుతి, స్వ మేళ, రాగ, ఆలాప, ఠాయ, గీత, ప్రబంధ, తాళములు అనెడు పదిప్రకరణముల

గూడిన "చతుర్దండి ప్రకాశిక" యను సంగీతలక్షణగ్రంథమును క్రీస్తుశకము 1660 లో రచించెను. ఇందు రాగాంగ, ఉపాంగ, భాషాంగ, రాగములను శ్లోకరూపముగా లక్షణములును, గీతరూపముగా లక్ష్యములును జెప్పియున్నారు. ఈవెంకటమఖి శ్రీజయదేవులు జేసిన (అష్టపది) గీతగోవిందకావ్యమువలె శ్రీత్యాగరాజవిషయమై యిరువదినాలుగు అష్టపదులు జేసినట్లు తెలియుచున్నది. ఈయన యొకప్పుడు సేతుయాత్రకై పోవుచు మార్గమధ్యమున చోరబాధాపీడితుడై "అతి నిబిడకంటకమష్ప్రదేశ" యను గీతమును లలితరాగమున పాడినతోడనే శ్రీరామలక్ష్మణులు కోదండపాణులై వచ్చి యాబాధను వారించిరట. ఒకప్పుడు విజయరాఘవభూపాలుడు తనదేశస్థులందరు శంఖచక్రముద్రాంకితులైయుండ నాజ్ఞాపింప నీవెంకటమఖి మధ్యార్జునమున వెలయు మహాలింగమూర్తిని "శంఖచక్రాంకిత త్యాచరేరే" యనుగీతమును రీతిగౌళరాగములో పాడి ప్రార్థించగనే రాజు జఠరరోగపీడితుండై వెంకటమఖిని ప్రార్థించి తనదేశస్థులు వారివారి స్వమతములలో నుండవచ్చునని యాజ్ఞాపించినమాత్రమున రాజునకు బాధతీరి సౌఖ్యముగానుండెను. ఇట్లు వీరి మహిమలు చాల గలవు. ఇతడు దాదాపు 250 సం॥లకు లోగడవాడని చరిత్రమువలన తెలియుచున్నది.

## 4. పురందర విఠలదాసు.

ఇతడు కర్నాటక బ్రాహ్మణుడు. మధ్వమతస్థుడు. కర్నాటకభాషలో గొప్ప పండితుడు. భక్తాగ్రేసరుడు. ఇతడు మొట్టమొదట పూనానగరమున సాహుకారియై కోటీశ్వరుడుగానుండి పాండురంగ విఠలుని యందలి భక్త్యతిశయమువలన విరక్తిగలిగి మహాభక్తుడై సంగీతసాహిత్యములలో మిక్కిలి ప్రజ్ఞకలవాడై యొక్కొక్కసందర్భమందు జేసిన కీర్తనములచే శ్రీపాండురంగవిఠలుని ప్రసన్నతనుగూడ జెందినవాడై యుండెను. ఇతని యద్భుతచరిత్రములు ఎవరికిని వ్రాయనలవిగావు. ఇప్పటికిని వాడుకలోగల సరళీవరుసలు, అలంకారములు, పిళ్లారిగీతములు ఇవి యీ మహానుభావునివలన నేర్పడినవిగా నున్నవి. ఆళ్వారాదులచే జేయబడిన తిరువాయ్‌మొళి అను ద్రావిడదివ్యప్రబంధమును శ్రీవైష్ణవబ్రాహ్మణులు దేవతాసన్నిధులందు యెటుల సేవింపుచున్నారో, అటులనే మధ్వమతమఠాధిపతులు వారివారి యాస్థానదేవతాసన్నిధులందు దీపురందరదాసులవారి కీర్తనలు పాడుట, నేటికిని జూడవచ్చును. ఇతనివలన జూడబడిన సూళాదులు పెక్కుగలవు. ఇతనికీర్తనములు వేదాంతవిషయముగా గనుబడుచున్నవి. ఈపురందరదాసులు ఆహోబలునికాలమునకుమును పేయుండవచ్చునని కొందరి యభిప్రాయము. అందువలన వీరు క్రీస్తు శకము 1500 ప్రాంతమువారని తెలియుచున్నది.

## 5. ముద్దుస్వామి దీక్షితులు.

ఇతడు రామస్వామి దీక్షితులకు క్రీస్తుశకము 1775 మన్మథసంవత్సరమున తిరువారూరిలో పుత్రుడై జన్మించెను. ఇతనితల్లి సుబ్బమ్మ. ఇతడు పదియారవ వత్సరము

లోపలనే క్రమాంతము వేదాధ్యయనము, కావ్యనాటకాలంకారము, కౌముదీ...
కొన్నివ్యాఖ్యానములు, సంగీతమును నేర్చుకొని, జ్యోతిష, వైద్య, మాంత్రిక, శాస్త్ర...
ములందు మిగుల ప్రజ్ఞగలవాడై ప్రఖ్యాతినొందెను. ఇతడు తన వివాహానంతరము...
మణలి చిన్నయా మొదలారియొద్ద నున్నపుడు యితనిజన్మాంతరసుకృతవిశేషమున...
"చిదంబరనాథయోగి" యను నొక మహాసిద్ధుడు వచ్చియుండునపు డీతని...
సంతసించి శ్రీవిద్యామంత్రము నుపదేశించి వెంటబెట్టుకొని గంగాతీరము...
చని ఐనుపర్ణములు మంత్రావృత్తిచే సిద్ధిబొందించి, అష్టమహాసిద్ధుల నందజేసి య...
వముతో వేదాంతశాస్త్రము నుపదేశించెను. తరువాత దీక్షితులు మహాత్ముని యను...
వలన మణలి వచ్చి దేవతలతృప్తికై అంతర్యాగ, బహిర్యాగముల నడిపించి తిరుత్త...
త్రమునకు వచ్చి సన్నిధిలో "సుబ్రహ్మణ్యపంచదశాక్షరీ" మహామంత్రము నావృ...
కొనుచుండునపుడు ఒకదినమున చెంగల్వరాయు డొకమహాపురుషునివలె వచ్చి...
చెరువుమని నోటిలో కండచక్కెరను వేసి మరుగుజెందెను. వెంటనే దీక్షితులు మ...
గౌళరాగమున ప్రథమావిభక్త్యంతముగా "శ్రీ నాథాదిగురుగుహో జయతి" యని...
మొదట సంస్కృతమున కీర్తనజేయ నారంభించెను. ఇదిగాక గురుగుహవిషయ...
నేడుకీర్తనలు చేసి కాంచీపురమునకు వచ్చి సహోదరులలో నాలుదినము లుండి...
కామాక్షిసన్నిధానమునందు శ్రీవిద్యోపాసి జేసికొని "కంజదళాయతాక్షి" "...
మ్రనాథం భజేహం" మొదలైన అనేకకీర్తనములు గేయకల్పనలు విలసిల్ల రచి...
తనతమ్ములచే ప్రసిద్ధపరచెను. ఆక్షేత్రమున నివసించుచుండిన ఉపనిషద్బ్రహ్మ...
వేదాంతవిచారణము చేసికొని యతనిచే చేయబడిన "రామాష్టపది"లకు వర్ణక్రమ...
లతో రాగతాళముల నేర్పరచెను. పిమ్మట కుటుంబముతో తిరువారూరికి వచ్చి...
చునప్పుడు "గురుగుహ" ముద్రతో శ్రీ త్యాగరాజస్వామిమీద ననేక కీర్తనము...
ఆనందేశ్వర, సిద్ధేశ్వర, అచలేశ్వర, హాటకేశ్వర, వాల్మీకేశ్వరులమీదను, ఆ...
మందున్న షోడశగణపతులమీదను, చోళమండలమున వెలయు శివక్షేత్ర, వి...
త్రములమీదను, పృథ్వ్యాదిపంచభూత క్షేత్రస్వాములమీదను, మధుర, ఆ...
గోవిలు మొదలైన పాండ్యదేశక్షేత్రములమీదను కాశీమొదలైన క్షేత్రములమీ...
సంస్కృతమునం దసాధారణములైన వాగ్గేయములతోనద్వైతభావము దప్పక వె...
మఖి సాంప్రదాయరాగముల విడుపక గమకజాతీయములు ఆయారాగజీ...
ములు రాగనామములు విలసిల్ల రచించినదిగాక సూళాది సప్తతాళములలో జేయ...
నవగ్రహకీర్తనములును కమలాంబావిషయమై తొమ్మిది కీర్తనములును రచించి
శిష్యులచే నాచంద్రతారార్కముగా విలసిల్లునట్లు జేసెను.

తన తమ్ములగు చిన్నస్వామిదీక్షితులు బాలస్వామిదీక్షితులు తనవద్ద...
కీర్తనములు, పాఠముచేసి కొనియుండునపుడు మధురనుండి ప్రభువులచే...
నింపబడి మధురకు వెళ్లి కొంతకాలముండగా చిన్నస్వామిదీక్షితులు ...
య్యెను. బాలస్వామి దీక్షితులు భ్రాతృవియోగమువలన విరక్తిజెంది హరియ...
నితో సేతువునకు వెడలి ఎట్టయపురమునకు వచ్చి మహారాజుచే నాదరింపబడి...
డెను. దీక్షితులు తన భ్రాతృవియోగము లోకస్వాభావమని తలచి కురు...

రికిచే నెక్కడకు వెడలెనో యని చింతించి భార్య లిద్దఱును శిష్యుడగు సుబ్రహ్మణ్యమును వెంటబెట్టుకొని మధురమార్గముగా శాత్తూరికి వచ్చి పెరుమాళ్లమంటపమున దిగి పూజసేయుచుండ కొందరు వైష్ణవబ్రాహ్మణులచే 'ఎట్టయపురము మహారాజువారు తిరువారూరినుండి వచ్చిన బాలస్వామికిని, రామేశ్వరమునుండి తెప్పించిన కన్యకను రేపు వివాహము జరుపుదురు. పోవుదము రండి'యని చెప్పిన మాటలు విని సంతోషపరవశులై వెంటనే "వెంకటేశ్వర ఎట్టప్పభూపతి మాశ్రితమోహం" అని మేఘరంజనిరాగములో నొక కీర్తనముజేసి, శిష్యునికి నేర్పియుంచెను. పిమ్మట వైష్ణవబ్రాహ్మణులతో వెడలి ఎట్టయపురమునకు వచ్చుచుండ మార్గమున వర్షములేక యెండుచున్న పంటను గని కనికరముగలిగి అమృతేశ్వరునిధ్యానించి "ఆనందామృతకర్షిణి అమృతవర్షిణి" అని అమృతవర్షిణిరాగమున నొక కీర్తనము జేసి శిష్యునికి జెప్పియుండునపుడే నిర్మలమైన ఆకాశమున నీలమేఘముగలిగి రాను రాను అభివృద్ధియై సెపరానివర్షము గురిసెను. నేగటినేల యగుటచే సంకటపడుచు సాయంకాలమునకు ఎట్టయపురమునకు వచ్చి తమ్ముని గని సంతసిల్లిరి. మహారాజు దీక్షితులరాక తెలిసి వెంటనే వచ్చి యుపచరించి వారిచే జేయబడిన మేఘరంజని కీర్తనమును విని సంతసిల్లి మరునాడు వచ్చి పెండ్లిని నడిపించిరి. వెంటనే దీక్షితులు తమ్మునిభార్యకు దోడుగ తనపెద్దభార్య నుంచి మహారాజుచే సన్మానింపబడి తిరువారూరికి వచ్చియుండెను. కొంతకాలమునకు మహారాజులవారి జ్యేష్ఠకుమారుడు పెండ్లికి రమ్మనివచ్చిన పత్రికను జూచి తన కవసానకాలము సమీపించియుండుటవలన హితులకు శిష్యులకు తిరుగ రానని చెప్పి ఎట్టయపురమునకు కుటుంబముతో వచ్చి యువరాజు పెండ్లిజరిగిన మూడవనెలయైన క్రీస్తుశకము 1835 మన్మథసంవత్సర తులాకృష్ణచతుర్దశియందు యశఃకాయులై స్కందగిరి కేగిరి. వీరి శిష్యులు (1) సంగీత ద్రావిడ పండితులైన తిరుక్కడయూరు భారతి. (2) ఆవడయారుగుడి వీణ వెంకటరామయ్య (3) తేవూరు సుబ్రహ్మణ్యయ్య (4) సంగీత మృదంగ లక్ష్యలక్షణములలో సమర్థుడైన తిరువారూరు శుద్ధమృదంగం తంబియప్పడు (5) భరతశ్రేష్ఠుడైన తంజావూరు పొన్నయ్య. (6) వడివేలు (7) భరత లక్ష్య లక్షణసమర్థుడైన కొరనాడు రామస్వామి. (8) నాగస్వరవాద్యమం దత్రిప్రతిష్ఠగల తిరువళుందూరు బిల్వవనం (9) బహుతానవర్ణపదముల రచించిన తిరువారూరు అయ్యాస్వామి. (10) నాట్యగానవిద్యలలో మిక్కిలి కీర్తిజెందిన తిరువారూరు కమలము. (11) గానమున సమర్థురాలైన వళ్లలారు గుడిఅమ్మణి మొదలగువారు.

## 6 క్షేత్రజ్ఞులు.

ఇతడు వైదికశ్రౌత్రియబ్రాహ్మణుడు. ఇతనియునికి మువ్వపురి. ఇది కృష్ణామండలములోని దని తెలియుచున్నది. ఇతడు ఆంధ్రభాషలో మిక్కిలి పరిజ్ఞానకలవాడు. సంగీతసాహిత్య జ్ఞానముగల గొప్పపండితుడు. ఈతడు బాల్యదశలో నొక మహాయోగివలన "గోపాలమూలమంత్రము" నుపదేశముపొంది మువ్వపురిలో వెలయు గోపాలుల

యమునానుండి భక్తితో మంత్రావృత్తిచేసుకొనుచు చిరకాలముండునపుడు శృంగార ర
దేవతయైన గోపాలుఁడు దర్శనమిచ్చి యనుగ్రహించెను. తోడనే క్షేత్రజ్ఞులు "శ్రీ
సుతుబారికి నేనోపలేక నినువేడితే గోపాలా మువ్వగోపాలా" అని వాగ్గేయర
ముగాపదములుజెప్ప నారంభించెను. ఇతనిపదములవలె, శృంగారరస మొలుకునట
కైశికీరీతిగాను, మృదుపదములుగలదిగాను, నాయకీనాయకలక్షణములు దప్పనిది
యర్థపుష్టిగలదిగాను, సందర్భానుసారముగ ఆయారసములకు దగినట్లు రాగములతోప
ధాతువులతోను, పదములు జేయదగినవారు యితనికిముందుగాని వెనుకగాని లేర
నిశ్చయముగా జెప్పవచ్చును. ఈ క్షేత్రజ్ఞులు మధుర, తంజావూరు, గోలకొండ,
లగు సంస్థానాధిపతుల సభలలో అనేకములగు పదములు జెప్పియున్నారనుటకు,
దేవగాంధారిరాగమున "వేడుకతో నడుచుకొన్న విటరాయడే" అను పదము
యున్నారు. ఈతనిపదము లనేకములు మువ్వగోపాలముద్రతో నుండును.
పదములు "కంచివరదుడు" "చెవ్వందిలింగడు" అని యుండినప్పటికిని మువ్వగో
ముద్ర లేకయుండవు.

రసికాగ్రేసరుడైన విజయరాఘవభూపాలుఁడు క్షేత్రజ్ఞులకు చేయునట్టి
మానముల జూచి ప్రబంధరచనాధురంధరులైన కవీంద్రములు యీర్ష్యచే మహారాజా
మీరేరా, రారా, పోరాయని జెప్పెడి క్షేత్రయ్యమీద యింతమోహమా, యితని య
బహుకృతియా యని పలుక మహారాజు క్షేత్రయ్య వచ్చినతోడనే ఈ సరి
జెప్పెను. క్షేత్రజ్ఞులు విని సరిక దాయని, కాంభోజరాగమున "పదరకపోవే" అనువి
విని, అనుపల్లవి రెండుచరణములు జెప్పి మూడవచరణమున "భామగో శకునము
మువ్వ గోపాలుఁడు వచ్చునని, కామించి నాథులకలయు చెలుల చూచి కరగి
నొందిరి" అని యింతవరకు జెప్పి కడపటి ఖండమును కవీంద్రులను పూరిజేయ
రాజునకు దెలియ జేసి సేతుయాత్ర వెడలిపోయెను. కవీంద్రులు సభకు వచ్చినతో
మహారాజు జరిగిన దంతయు చెప్పి కడపటిఖండము పూరిజేయుమనగా కవీ
లందరు చాలవరకు యోజించి తగినసమపాయము తోచక చింతిల్లుచుండిరి. క్షేత్ర
తిరిగి వచ్చినతోడనే కవీంద్రు లందరు క్షేత్రయ్యవద్దకు వచ్చి ప్రార్థించి తమ యస
తను దెలియజేసిరి. వెంటనే క్షేత్రజ్ఞులు "రామ రామ యీమేనితో వానిమో
జూడవలెనా మొదటి పొందే చాలు"అని పదమును పూరిచేసినది విని, కవీం
లందరు నీవు సాక్షాద్గోపాలుడవేయని కొనియాడి రాజువద్దకు బోయి యీసం
తెలిపి మిక్కిలి పొగడిరి. ఈక్షేత్రజ్ఞులు విజయరాఘవభూపాలుని కాలమునా
డగుటచే క్రీ. 1650 సం|| ప్రాంతమువాడని తెలియుచున్నది.

## 7 రామదాసు.

ఇతడు నియోగిబ్రాహ్మణుడు, కంచర్ల కులోద్భవుడు. ఇతనియునికి నేల
డపల్లె; తండ్రి లింగనమంత్రి, తల్లి కామాంబ, గోపన్న యనునామముకలవా
ఇతడే రామదాసు. ఇతడు సంగీతసాహిత్య [illegible] మిక్కిలి భక్తుడు. ఇ

…నాదిగా సద్వృత్తియం దుండువాడు. గనుక భాగవతాది పురాణకథలు వినునపుడు …బ్రహ్మాండపురాణమునందు గౌతమీమాహాత్మ్యమును భద్రాచలప్రభావంబును విని …భద్రాద్రికింజని శ్రీరాముని సేవించి రామభజన సేయుచుండునట్టి మహాభాగ్యం బెన్న …డనని యొనగూడునోయని తలంచుచుండెను. ఇట్లుండ నొకదినంబున భక్తాగ్రేసరుడగు …కబీరుదాసు యితనియింటికి వచ్చి యితనిభక్తికి సంతసించి శ్రీరామ తారకమంత్రము …నుపదేశింప నదిమొదలు గోపన్న యెడతెగక శ్రీరామ తారకమంత్రము జపించుచుం …డెను. ఒకనాటిరాత్రి స్వప్నంబున శ్రీరామచంద్రులు ప్రత్యక్షమై 'నీవు భద్రాచలము …తాలూకా తహశీలుదారువని కాగలవు కాబట్టి నీవీక్షణమందే బయలుదేరి గోలకొం …డకుజని తానీషానుచూడు'మనగా గోపన్న యదరిపడిలేచి రాముడు తనకు సాక్షాత్క …రించిచెప్పిన వాక్యములను తన మిత్రబాంధవులకుజెప్పి యాదినమే బయలుదేరి గోల కొండకు జనెను. అచ్చట మేనమామలగు అక్కన్న మాదన్నగార్ల సహాయమున తానీషాను దర్శించి వారిచే భద్రాచలము తహశీలుదారుగా నియమింపబడెను. వెంటనే గోపన్న భద్రాచలమునకు జని యుద్యోగమును స్వీకరించి భాగవతులైన బ్రాహ్మణులకు ప్రతిదినము సంతర్పణలుజేయుచుండ నొకనాటి సంతర్పణమున నతనికుమారుడు వేడి గంజినీటిప్రవాహమునందుబడి మృతినొందెను. అది తెలిసియు గోపన్న విచారము జెందక బ్రాహ్మణసంతర్పణ పూర్తిజేసినవాడై పుత్రుని శ్రీరామసన్నిధిని బడవైచి యనేకవిధముల స్తుతింపదొడగెను. అంత నాబాలుండు, రామప్రసాదంబున నిద్రించువాడు మేల్కాన్న తెరంగున బునర్జీవితుండయ్యెను. తోడనే గోపన్న యనేక విధంబుల బ్రార్థించి శ్రీరామభద్రాలయ జీర్ణోద్ధారణకై నిలువయుండిన సర్కారు ద్రవ్యము ఆరులక్షల వరహాలు వ్యయపరచి చారుస్వర్ణగోపురద్వారములను నిర్మించి భాగవతులతో గూడి భజనచేసికొనుచుండెను. ఇది తెలిసి నవాబు గోపన్నను పట్టితెప్పించి పండ్రెండుసంవత్సరములు కఠినశిక్ష విధించి నిర్బంధించెను. ఆసమయమున గోపన్న యెడతెగక శ్రీరామచంద్రునిపై యనేకకీర్తనములు చేసివిలపించు తతి కరుణాసముద్రుండగు శ్రీరామభద్రుడు కనికరమున లక్ష్మణసహితుడై భటవేషధారులుగా తానీషా యంతఃపురమున కర్ధరాత్రమందువచ్చి నిదురించుచున్న తానీషాను లేపి యారులక్షలపైకము చెల్లించి రశీదుపుచ్చుకొని తానీషారూపమున చెరసాలకువచ్చి రశీదు రామదాసునకిచ్చి యంతర్ధానమైరి. వెంటనే తానీషా యిది శ్రీరామునిమహిమగాని వేరుగాదని గుర్తించి రామదాసును చెరసాలనుండి విడిపించి కొలువుకూటమునకు దోడ్కొనివచ్చి తగిన మర్యాదలుచేసి శ్రీరామలక్ష్మణులు తనకుచెల్లించిన యారులక్షల వరహాలును విశేష వస్త్రాభరణంబు లొసంగెను. ఇట్లు తానీషాచే సన్మానింపబడినవాడై రామదాసు భద్రాచలమునకు జనుచుండ మార్గమధ్యమున చోరబాధితుడై శ్రీరాముని ధ్యానింప శ్రీరాముడు రామదాసున కదృశ్యుండై యాచోరులం దరిమెను. రామదాసు పరమానందభరితుడై రామసంకీర్తనజేయుచు భద్రాచలమునందు బ్రవేశించి రాముని దర్శించి భజనసేయుచుండునపుడు శ్రీరామభద్రునిచే వరములనందిన కొంతకాలమునకు శ్రీహరిప్రేరితంబైన సుమరథంబు రాగ రామదాసుగారు పరమపదమున కేగిరి. వీరు రమారమి 300 సంవత్సరములకు లోగడవారని తెలియుచున్నది.

# 8 జయదేవులు.

ఇతడు బ్రాహ్మణుడు. తండ్రి భోజదేవుడు. తల్లి రామాంబ. భార్య పద్మావతి. మిత్రులు పరాశరాదులు. నివాసము బిందుబిల్వము. ఉత్తరదేశస్థుడైన గోవర్ధనాచార్యుని శిష్యుడు. శ్రీ కృష్ణచరణారవిందమకరందతుందిలమిళిందాయమానమానసుడు. సంస్కృతభాషలో నసదృశమైన వాగ్విలాసవైభవముగల కవి. చంద్రాలోకము, రతిమంజరి, కారకవాదము, తత్త్వచింతామణి, ప్రసన్నరాఘవము మొదలగు గ్రంథములు రచించినఘనుడు. శ్రీరాధాకృష్ణ విషయమై శృంగారరసప్రధానమై నిలసిల్లెడి "గీతగోవింద" (అష్టపది) మను ప్రబంధమును గాంధర్వముగా రచించిన రసికావతంసుడు. ఈతడు యీయష్టపదులకు నేర్పరచిన రాగములను, ఫణుతులును యెట్టులనో వాడుక లేకపోయెను. కాని రమారమి 330 సంవత్సరములకు మునుపు గల దాక్షిణాత్యసంగీతజ్ఞులు యిరువదినాలుగు అష్టపదులకు రాగతాళములు వాని ననుసరించి యేర్పరచిన గేయఫణుతులును మాత్రమిపుడు వాడుకలో నున్నవి.

ఈ జయదేవకవీంద్రుడు 19 వ యష్టపదిని వ్రాసుకొనునపుడు "స్మరగరళఖండనం మమ శిరసి మండనం, దేహి పదపల్లవ ముదారం" అని తోచినతోడనే వ్రాయుట మాని తాటాకును భార్యయైన పద్మావతి చేతికిచ్చి తలయంటుకొని స్నానమునకై నది కేగెను. వెంటనే శ్రీకృష్ణుడు తలయంటుకొనిన జయదేవస్వరూపముగా వచ్చి పద్మావతిని బిలిచి తాటాకును లేఖినిని యడిగిపుచ్చుకొని జయదేవులకు తోచని సాహిత్యమును వ్రాసి యిచ్చిపోయెను. వెంటనే స్నానమున కేగిన జయదేవులు యింటికి వచ్చి తాటాకు నడిగెను. ఇప్పుడే మీరు వ్రాసియిచ్చిపోతిరి గదా యని యివ్వబడిన తాటాకును చూచి యానందసాగరమగ్నుడై 'ఓ పద్మావతీ! భగవంతుడు నీకు దర్శనమిచ్చెను. నీ సుకృతము నే మని పొగడుదు' నని చెప్పినది గాక యీయష్టపది నెనిమిదవచరణముగ "జయతు పద్మావతీరమణ జయదేవకవిభారతీఫణిత మితి గీతం" అని తనపేరునకు మునుపు ఆమెపేరు బెట్టి యిరువది యొకటవ యష్టపది రచియించెను. ఇందువలన నర్చుటచే భార్యకు భగవద్దర్శనమైనందుకు నిదర్శనముగా నున్నది. ఈ మహాకవి వంగ దేశమును బాలించిన వల్లాలసేనుని కుమారుడగు లక్ష్మణసేనమహారాజుగారి యాస్థానపండితుడుగా నుండెను. ఇతడు శార్ఙ్గదేవుల కాలము నాటివాడుగా నుండవచ్చునని కొందరి యభిప్రాయము. ప్రొఫెసర్ వీబరు దొరగారు నిర్ణయించినదానినిబట్టి శకము 1110 వ సంవత్సర ప్రాంతమువా రని కూడ తెలియుచున్నది.

# 9 శ్రీనారాయణతీర్థ యతీంద్రులు.

ఈ యతీంద్రులు మహాభక్తులు. సంగీత సాహిత్య విద్యలయందు మిక్కిలి ప్రఖ్యాతులు. వీరి సంగీతసాహిత్యఫణుతులు వీరివలన రచింపబడిన తరంగములచే విశదమగును. వీరు రమారమి 330 సంవత్సరములకు ముందుండిన వారనియు, ఉత్తరదేశస్థులనియు

కొందరు చెప్పుచున్నందున వీరు క్రీస్తుశకము 1600 సంవత్సరము ప్రాంతమువా రని తెలియుచున్నది. వీరి తరంగములు యిప్పటికిని వాడుకలో నుండి పూర్వసాంప్రదాయసిద్ధములైన భజనలయందు వినుచున్నాము.

# 10 శ్యామశాస్త్రులు.

శ్రీ కంచికామాక్షీదేవి యుత్సవమూర్తియైన బంగారు కామాక్షిదేవి, తురకల కలహమువలన తాళలేక, పూజకులును ద్రావిడబ్రాహ్మణులలో ఔత్తరాహులునైన కొందరు స్థానికులతో వెడలి శ్రీపురమను తిరువారూరికివచ్చి రమారమి ముప్పదియైదు సంవత్సరములవరకు తంజనగర రాజులవలన నేర్పరుపబడిన పూజోపచారాదుల నంగీకరించుచుండునపుడు యీ శ్యామశాస్త్రి తల్లిదండ్రులు శ్రీకామాక్షిని అత్యంతభక్తితో పూజించుచుండుటయేగాక తమకు పుత్రులు లేరను విచారముతో ప్రతిమాసమందును కడపటిస్థిరవాసరమున శ్రీవేంకటాచలపతిప్రీతిగా బ్రాహ్మణసంతర్పణలు సేయుచుండిరి. ఒకానొక స్థిరవాసరమున బ్రాహ్మణసంతర్పణ జరుపుచుండగా శ్రీ వేంకటాచలపతి యొక ముసలి బ్రాహ్మణునిమీద యావేశించి, 'ఓదంపతులారా! మీ కొక సంవత్సరములోపల యశోవంతుడైన యొక సుపుత్రుడు గలుగును. అనిచెప్పినట్లే యామెగర్భవతియై పదినెలలు నిండినతోడనే క్రీస్తుశకము 1763 చిత్రభానుసంవత్సర మేషరవి కృత్తికానక్షత్రమందు శ్రీనగరమను తిరువారూరిలో శ్యామశాస్త్రులం గనియె. ఇతడు బాల్యమందే సంస్కృతాంధ్రభాషలలో మహాప్రౌఢుడై బంగారు కామాక్షీసహితుడై తంజావూరికివచ్చి తనబంధువులగు నొక సంగీత విద్వాంసునివద్ద సరళీ మొదలు స్వరజానమువరకు నేర్చుకొనెను. అంతలో శ్రీవిద్యాపరమానుగ్రహమందెను. ఇతనిభాగ్యవిశేషమువలన, నుత్తరదేశమునుండి సంగీత విద్యాపారంగతులైన సంగీతస్వాములను నొక యతీంద్రులవచ్చి యితనిని శిష్యునిగాగైకొని మూడుసంవత్సరములు సంగీత లక్ష్యలక్షణమర్మము లన్నియు క్రమముగా నభ్యసింప జేసి వీరిగాన సామర్థ్యముల నెరింగి మిక్కిలి యశోవంతుడ వౌదువని యనుగ్రహించి కొన్నిదినములవరకు ఆది అప్పయ్యపాట వినుమనిచెప్పి సంగీతస్వాములు కాశికి వెళ్ళిరి. పిమ్మట కొంతకాలమునకు శ్రీకామాక్షీదేవి యనుగ్రహమువలన సాహిత్య చమత్కారములు గేయకల్పనలు తాళవిషయములు వెలయ "శ్యామకృష్ణ" యను ముద్రతో బహుకీర్తనలు స్వరజతులు తానవర్ణములు రచించి యవి శిష్యమండలివలన ప్రకాశపరచి యశఃకాయులై క్రీస్తుశకము 1827 వ్యయసంవత్సర మకరరవి దశమినాడు శ్రీపురముజేరిరి.

# 11 అరుణాచలకవిరాయలు.

ఇతడు నల్లతంబి పిళ్లెగారి కుమారుడు. తుల్లయాదిగ్రామ కాపురస్థుడు. ద్రావిడభాషలో పంచలక్షణములు దెలిసిన విచక్షణుడు. కంబరామాయణమును అర్థప్రసంగముజేయుటయం దితడు చతురుడు. అరవభాషలో కీర్తనములు రచించినవారిలో

యితడు పదునెనిమిదవవాడు. ఇతడు చిన్నవయస్సుతో మిక్కిలి విద్యనభ్యసి
టయే గాక వివాహానంతరము గూడ ధర్మవరమందు విద్య నభ్యసించెను. ఇతడు
గారము, వెండి వర్తకము చేయువా డగుటచే వ్యాపారరీత్యా నొకప్పుడు ధర్మ
మతములోనికి వచ్చి సంగీతము పాడుటచే నచ్చటి మఠాధిపతి యితనికి "శిఖా
యను పేరుపెట్టెను. వీరి మిత్రులలో నొకడగు చదరాదపురము వెంకట కోద
రామయ్యర్ అను సంగీతవిద్వాంసునికోరిక ననుసరించి శ్రీమద్రామాయణ
కథాసందర్భములు విడువక ఆ యా రసములకు దగిన రాగములతో వర్ణక్రమ
వెలయ ఆఱవకాండమువరకు ద్రావిడ కీర్తనములుగా రచించి మణలి ముద్దుకృష్ణ మొద
సభలో శ్రీరామస్వామి దీక్షితులు మొదలైన విద్వాంసులయెదుట వినిపించి క
భిషేకము జెంది కీర్తిబొందెను. తరువాత కొంతకాలమునకు వీరు శ్రీరంగమ
అచ్చటి దేవాలయపూజారి కోరిక ననుసరించి "ఏ॥ పళ్ళికొండీరయ్యా" అను
మును యింకా రామాయణకీర్తనములు అనేకము పాడి వారిచే బహుమతులను
సిరి. వీరు మిక్కిలి రాగభావజ్ఞానముగలవా రనియు, సూక్ష్మగ్రాహులనియు
కీర్తనములబట్టి చెప్పవచ్చును. వీరికి యిరువదిమందివరకు శిష్యులు గలరు. వీరు
శకము 1711 మొదలు 1778 వరకుగల కాలమునాటివారని తెలియుచున్నది.

## 12 ఆనతాండవపురం గోపాలకృష్ణ భారతి.

ఈ విప్రుడు శివభక్తుడు. ద్రావిడభాషయందును సంగీతవిద్యయందునుమిక్కి
పండితుడు. వీరు రక్తిరాగ దేశీయరాగములయందే గాక కొన్ని యపూర్వరాగ
యందుగూడ గేయకల్పనా చమత్కారములు వెలయున ట్లనేక కీర్తనములు "గోపా
కృష్ణ" ముద్రతో జెప్పియున్నారు. 'నందన్' అను భక్తచరితమును 'మామి' న
కమును గేయరూపకముగా హాస్యరసప్రధానముగా జేసియున్నారు. వీరు బ్రహ్మ
చర్యాశ్రమముతో డెబ్బదియేండ్లవఱకు జీవించి నేటికి నలుబదియెనిమిదిసంవత్సరము
మునుపు కైలాసవాసులైరి. వీరు క్రీస్తుశకము 1815 మొదలు 1885 వరకుగల కా
నాటివారని వీరిచరిత్రవలన స్పష్టపడుచున్నది. వీరి కీర్తనములు దాక్షిణాత్య సంగీత
ముఖ్యముగా పాడుచుండుట నేటికిని జూడవచ్చును.

## 13 పట్నం సుబ్రహ్మణ్యయ్య.

ఇతడు ద్రావిడబ్రాహ్మణుడు. ఇతనియునికి పంచనదము. సంగీతాంధ్ర
లలో మిక్కిలి విచక్షణుడు, ఇతడు తెనుగునజేసిన కీర్తనము లనేకము లిప్పుడు ప్ర
ము లైయున్నవి. ఇతడు 34 సంవత్సరములకుమునుపు గతించెనని చరిత్రవలన స్పష్ట
చున్నది.

## 14 వెంకటేశ్వరశాస్త్రులు.

ఇతడు సంగీతసంస్కృతాంధ్రభాషలలో మిక్కిలి పండితుడు, వైణికుడు. ఈయన క్రీస్తుశకము 1892 "లో సంగీతస్వయంబోధిని" అను నొక పుస్తకము తెనుగున అచ్చొత్తించి ప్రకటించెను. ఇతనిచే జేయబడిన సంస్కృతకీర్తనలు కొన్ని గలవు. ఈయన 36 సంవత్సరములకుమునుపు గతించెనని చరిత్రలవలన స్పష్టపడుచున్నది.

## 15 గర్భపురివారు - ధర్మపురివారు.

వీరలు "గర్భపురి" "ధర్మపురి" ముద్రలతో తెనుగులో శృంగారరసప్రధానములుగా అనేక జావళీలు కీర్తనములు జేసియున్నారు. ఈ కీర్తనలు యిప్పటికి ప్రసిద్ధముగనున్నవి. వీరు కొలదికాలముక్రింద గతించినటుల కొందరివలన తెలియుచున్నది.

## 16 గురుమూర్తిశాస్త్రులు.

ఇతడు త్రైలింగ్య బ్రాహ్మణుడు. మురికినాటివాడు. నివాసము తిరునవ్వేలిజిల్లా కయత్తారు అనుగ్రామము. చతుశ్శాస్త్రపండితుడు. సంగీతములో నతిసమర్థుడు. మణలి చిన్నయ్యా మొదలారిచే బహుసన్మానము జెందిన కీర్తివంతుడు. అనేక గీతప్రబంధకర్తన రచనావిశారదుడు. ఇతడు రచించిన లక్షణగీతములు యిప్పటికిని మిక్కిలి ప్రసిద్ధిలో నున్నవి. ఇతడు రామస్వామిదీక్షితుల కాలమునాటివాడనియు క్రీస్తుశకము 1740 ప్రాంతమువాడనియు తెలియుచున్నది.

## 17 సోమనాథ పండితుడు.

ఇతడు ముద్గలసూరి కుమారుడు, త్రైలింగ్య బ్రాహ్మణుడు. సంస్కృత భాషయందును, సంగీతశాస్త్రమందును గొప్ప ప్రజ్ఞగల విద్వాంసుడు. ఇతడు "రాగవిబోధము" అను సంగీత లక్షణగ్రంథమును క్రీ॥ శ॥ 1609వ సంవత్సరమున సంస్కృతమున రచించెను. ఈ గ్రంథమునకు క్రీస్తుశకము 1895వ సంవత్సరమున పూనానగరవాస్తవ్యుడగు పురుషోత్తమ ఘుర్పురే అనుమహారాష్ట్రపండితుడు సంస్కృతమున వ్యాఖ్యానము వ్రాసి ప్రకటించెను. ఈ సోమనాథపండితుడు ఎప్పటికాలపువాడైనది యేగ్రంథమందునను వ్రాయబడి యుండలేదు. కాని వీరు రాగవిబోధమును రచించిన కాలమునుబట్టి 1600 ప్రాంతమందుండిరని యూహింపవచ్చును. ఇతడు గోదావరీమండలము వాడని కొందరు తెలుపుచున్నారు.

# విషయసూచిక.





## లక్షణగీతములు.



## స్వరజతులు.



## తానవర్ణములు.

శ్రీపట్నం సుబ్రహ్మణ్యయ్యగారి కీర్తనలు.



శ్రీముద్దుస్వామి దీక్షితులవారి కీర్తనలు.



శ్రీకరూరు దక్షిణామూర్తిఅయ్య కీర్తనలు.



శ్రీకుమార యెట్టేంద్ర మహారాజువారి కీర్తన.

# ఇందు ఉపయోగించియుండు గురుతుల వివరము.

| గురుతులు. | వివరములు. | వ. రా. |
|---|---|---|
| ప. | పల్లవి. | |
| అ. | అనుపల్లవి. | |
| చ. | చరణము. | |
| ము. | ముక్తాయిస్వరము. | |
| త్రి. | త్రిశ్రజాతి. | |
| చ. | చతురశ్రజాతి. | |
| ఖం. | ఖండజాతి. | |
| మి. | మిశ్రజాతి. | |
| సం. | సంకీర్ణజాతి. | |
| , | ఒకకళను తెలుపునది. | ఇట్టికళలు యెన్ని... డిన అన్ని అక్ష... యెరుంగునది. |
| ; | రెండుకళలను తెలుపునది. | |
| — | మధ్యమకాలమును తెలుపునది. | |
| = | త్రికాలమును తెలుపునది. | |
| । | తాళఘాతను తెలుపునది. | |
| ॥ | తాళఆవర్తముయొక్క అంత్యమును తెలుపునది. | అతీతస్థానమంద... గురుతు ఆవర్తము... దుండును. |
| * | తాళమునందు గీతావర్తముయొక్క అధికారమును తెలుపునది. | |
| - | జాతుల విభాగమును తెలుపునది. | |
| ,, | పైప్రకారమని తెలుపునది. | |

ముఖ్యగమనింపు:—ఈ గ్రంథమునందు గీతాదివర్ణముల ...
గాక నొకటి రెండు కీర్తనలవరకును అభ్యాసకులకు సులభముగ గ్రాహ్యమ...
సాహిత్యావర్తములందు ఆయాచోటులకు దగినటుల, అ. ఇ. ఉ. ఎ. ఒ. ం...
లనే యుపయోగించి మిగత కీర్తనల సాహిత్యావర్తములన్నిటియందు నీయత...
గురుతుగా(.) ఈ బ్రాకెట్ సందుగల చుక్కల నుపయోగించియుండుట గమని...

ఉదాహరణము:—1 రా ...., = రా అ అ అ అ
2 ము ...., = ము ఉ ఉ ఉ
3 ని ...., = ని ఇ ఇ ఇ
4 నే ...., = నే ఎ ఎ ఎ ఎ
5 విం ...., = వి ం ం ం ం

శ్రీ ర స్తు.

# గా న క ళా చ ం ద్రి క



## ల క్ష ణ స ం గ్ర హ ము

### వందన శ్లోకము

శ్లో. చైతన్యం సర్వభూతానాం నిర్వృతిం జగదాత్మనాం,
నాద బ్రహ్మ తదానంద మద్వితీయ ముపాస్మహే.

### సంగీత లక్షణము

శ్లో. గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీతముచ్యతే.

తాత్పర్యము—గీతము, వాద్యము, నృత్యము అనెడు నీ మూటి చేరికయే సంగీత మనంబడును.

### నాద లక్షణము

శ్లో. ననాదేన వినా గీతం ననాదేన వినా స్వరః,
ననాదేన వినా రాగః తస్మాన్నాదాత్మకం జగత్.

తా. నాదము, గీతము, స్వరము, రాగములకు ప్రధాన మగుటంజేసి ప్రపంచము నాదస్వరూప మనబడుచున్నది. ఇట్టినాదము శరీరమునకు ప్రాణమువలె సంగీతమునకు ముఖ్య మని యెరుగునది.

### నాద శబ్దార్థము

శ్లో. నకారం ప్రాణనామానం దకార మనలం విదుః,
జాతః ప్రాణాగ్నిసంయోగాత్తేన నాదోభిధీయతే.

తా. నాద మను రెండుఅక్షరములలో న, యను అక్షరము ప్రాణమనియు, ద, యనుయక్షరము అగ్నిరూపమనియు జెప్పబడుటచే ప్రాణాగ్నులసంయోగమువలన

నాద ముత్పత్తియగుచున్నది. మనుష్యశరీరమునందుగల హృదయము, శిరస్సు, యనెడు త్రిస్థానములలోనుండి బయలువెడలునప్పుడీనాదమును, వరుసగా మంద్ర మనియు, తరువాత మధ్యమనియు, పిమ్మట తారమనియు చెప్పబడును.

## స్వర ప్రకరణము

### స్వర శబ్దార్థము

శ్లో. స్వతో రంజయతి శ్రోతృచిత్తం సస్వరఉచ్యతే.

తా. స్వతః = స్వకీయముగా, రంజయతి = రంజింపచేయునది (అనగా వికమను ఆనందము కలిగించునది) గనుక స్వర మనబడును.

### సప్తస్వర నామములు

శ్లో. షడ్జం ఋషభ గాంధారౌ మధ్యమః పంచమ స్తథా,
దైవతంచ నిషాదశ్చ స్వరా స్సప్త ప్రకీర్తితాః.

తా. షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, దైవ నిషాదము అని ఈయేడును సప్తస్వరములకు యౌగికనామములు. వీటికి వ్రాతగా రణసౌకర్యార్థసంజ్ఞలుగ, స, రి, గ, మ, ప, ధ, ని, అను నేడువర్ణములను యేడు లుగ సాధనసౌకర్యములకై నేర్పరుపఁబడి సప్తస్వరము లనుపేర వాడఁబడుచున్న

### సప్తస్వర ధ్వని దృష్టాంతరములు

అవతారిక:—పై తెలుపబడిన సప్తస్వరములకు, నుపమానధ్వను లీక్రింద బడినవిధమున గుర్తెరుగునది.

శ్లో. షడ్జం మయూరో వదతి గావో ఋషభభాషిణః,
అజావికంతు గాంధారం క్రౌంచః క్వణతిమధ్యమమ్,
పుష్ప సాధారణే కాలే పికః కూజతి పంచమమ్,
దైవతం హేషతే వాజీ నిషాదం బృంహతే గజః.

తా. షడ్జస్వరమువలె — నెమలి కూయును.
ఋషభస్వరమువలె — గోవు అంకెవేయును.
గాంధారస్వరమువలె — మేక శబ్దించును.

మధ్యమస్వరమువలె – క్రౌంచపక్షి పలుకును.
పంచమస్వరమువలె – వసంతఋతువున కోకిల కూయును.
ధైవతస్వరమువలె – గుఱ్ఱము సకిలించును.
నిషాదస్వరమువలె – ఏనుగు ఘీంకరించును.

## స్వరముల ప్రకృతి వికృతి భేదములు

పైస్వరములలో షడ్జపంచమములు, తప్ప మిగతస్వరములగు ఋషభ, గాంధార, [illegible]ధ్యమ, ధైవతనిషాదములు వికృతభేదముల నొందుటచే సప్తస్వరములు ప్రకృతి [illegible]తి భేదములతో పదునాఱువిధము లగుచున్నట్లు ఈ క్రింది పధకమున సులభముగా [illegible]యనగును.

| [illegible]కేత [illegible]లు | ప్రకృతి | వికృతి భేదములు | వికృతి | | మొత్తం |
|---|---|---|---|---|---|
| [illegible] | షడ్జము... | ... | ......... | ......... | 1 |
| [illegible] | శుద్ధఋషభము | 2 | చతుశ్శ్రుతిఋషభము | షట్ఛ్రుతిఋషభము | 3 |
| [illegible] | శుద్ధగాంధారము | 2 | సాధారణగాంధారము | అంతరగాంధారము | 3 |
| [illegible] | శుద్ధమధ్యమము | 1 | ప్రతిమధ్యమము | ......... | 2 |
| [illegible] | పంచమము | ... | ......... | ......... | 1 |
| [illegible] | శుద్ధధైవతము | 2 | చతుశ్శ్రుతిధైవతము | షట్ఛ్రుతిధైవతము | 3 |
| [illegible] | శుద్ధనిషాదము | 2 | కైశికీనిషాదము | కాకలీనిషాదము | 3 |
| | | | | | 16 |

## స్వర స్థాననిర్ణయము

పైకనుబఱచిన విధమున సప్తస్వరములు ప్రకృతి వికృతులచే పదునాఱు భేదము [illegible]న్నను అనుభవముచే నవి పండ్రెండుస్థానములయందే బుట్టునటుల యీ క్రింద [illegible]ఱచిన పధకమున గమనించి యట్టిస్థానములలో మూడు, నాలుగు, పది, పదు[illegible]ండు, స్థానములందు స్వరములు రెండేసి బుట్టుటచే స్వరములు పదునాఱైనను అవి [illegible]స్థానములు పండ్రెండే యని తెలియనగును. ఇదియుఁగాక వీణాది జంత్రముల స్థానావలోకనచేగూడ నీవిషయముల జక్కఁగ నెరుగనగును:

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | స్వరస్థా... |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | రి - గ | రి - గ | గ | మ | మ | ప | ద | ద - ని | ద - ని | ని | స్వ... |
| షడ్జము | శుద్ధఋషభము | చతుశ్శ్రుతిఋషభము శుద్ధగాంధారము | షట్శ్రుతిఋషభము సాధారణగాంధారము | అంతరగాంధారము | శుద్ధమధ్యమము | ప్రతిమధ్యమము | పంచమము | శుద్ధధైవతము | చతుశ్శ్రుతిధైవతము శుద్ధనిషాదము | షట్శ్రుతిధైవతము కైశికినిషాదము | కాకలినిషాదము | |
| 1 | 2 | 3 4 | 5 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 13 | 14 15 | 16 | స్వర: |

N. B. పధకమునందు జూపబడినరీతి ఒకస్థానమందు బుట్టెడు రెండు రెండు అధికారములను ఒకేరాగములో బొందవని యెరుగునది.

ఉదాహరణము:—చతుశ్శ్రుతి, ఋషభ, శుద్ధగాంధారములు ఒకే బుట్టుటచే సమధ్వనిని వహించియున్నను, ఈరెండు స్వరములు రాగములలో నైనను రి, గ, అనెడు రెండు అధికారములబొంది ప్రయోగింపబడవు. ఇటులే ధైవత, నిషాదభేదంబుల నూహించునది.

## స్థాయి వివరణము

పై నుపహరించియుండువిధమున ఒకటిమొదలు వరుసగానుండు పం స్థానములుగల ఒకభాగము స్థాయి యనంబడును.

అట్టిస్థాయిలు మూడువిధములు_అవియేవన–1. మంద్రము, 2. మధ్య రము వీటికే త్రిస్థాయి యని పేరు. వీటిలో మొదటిదగు మంద్రస్థాయి మొ దగు తారస్థాయి చివరవఱకుగల స్వరములు వరుసగా హెచ్చుచుండును. లలోనుండు స్వరములకు సంకేతముగ స్వరమునకు క్రిందచుక్క (·) గురుతు స్థాయి అనియు, గుఱుతు స్వరముపైనుండిన తారస్థాయి యనియు, ఏ లేకుండిన మధ్యస్థాయియనియు దెలియగలుగుటకై క్రింది స్థాయిపధకము గమనించవలెను. మరియు స్వరములకుపైన రెండు గురుతులుండిన అతితా అట్టి రెండుగురుతులు స్వరములకు క్రిందనుండిన అనుమంద్రమనియు పేరు

ద్రమును అతితారమును తానములందే విశేషముగ నుపయోగించుటచే మొదట
యబడియుండలేదు.

| నుమం స్థాయి | మంద్రస్థాయి | మధ్యస్థాయి | తారస్థాయి | అతితార స్థాయి |
|---|---|---|---|---|
| ని | స రి గ మ ప ధ ని | స రి గ మ ప ధ ని | స రి గ మ ప ధ ని | స |

## దశవిధ గమకములు

ఆరోహ మవరోహంచ ఢాలు స్ఫురితకంపితౌ,
ఆహతః ప్రత్యాహతశ్చ త్రిపుచ్ఛాన్దోళమూర్ఛనాః.

తా. ఆరోహణము, అవరోహణము, ఢాలు, స్ఫురితము, కంపితము, ఆహతము, త్యాహతము, త్రిపుచ్ఛము, ఆందోళము, మూర్ఛన యని గమకములు పది. ఈపదిన్నీ హారణములసహితము నీక్రింద నుదహరింపబడిన పధకమున నూహించునది.

| ంఖ్య | గమకములు | ఉదాహరణములు |
|---|---|---|
| 1 | ఆరోహణము | స రి గ మ ప ధ ని సే |
| 2 | అవరోహణము | సే ని ధ ప మ గ రి స |
| 3 | ఢాలు | స ప, స మ, స గ, స రి, స స |
| 4 | స్ఫురితము | స స, రి రి, గ గ, మ మ |
| 5 | కంపితము | పా ప ప ప ప |
| 6 | ఆహత ము | స రి, రి గ, గ మ |
| 7 | ప్రత్యాహతము | సే ని, ని ధ, ధ ప |
| 8 | త్రిపుచ్ఛము | స స స, రి రి రి, గ గ గ, మ మ మ |
| 9 | ఆందోళము | స రి స పా ప - రి గ రి మా మ |
| 10 | మూర్ఛన | స రి గ మ ప ధ ని - రి గ మ ప ధ ని సే |

## ఆరోహణావరోహణలక్షణము

ఆరోహణమనగా ఒకస్వరము ననుసరించి తక్కినస్వరములు క్రమముగా ఉచ్చ ని పోవుట.

ఉదా:—స. రి. గ. మ. ప. ధ. ని. సే

